శ్రీ

జ్ఞానలహరి.

THE

# JNANA-LAHARI.

---

EDITED AND PUBLISHED

BY


**SUSARLA GOPALASASTRY, B. A.,**

*First Grade Pleader,*

AMALAPURAM,

*GODAVARI DISTRICT.*



**AMALAPURAM:**

PRINTED BY TEKI VENKATESAM

PROPRIETOR

AT THE SARVANI PRESS

---

*1910.*

where there is any disorder in the body such as severe indigestion, they abstain from sense-objects. These two classes of men still possess taste for enjoyment. They are not (రసవర్జం) free from relish for objects; mere withdrawal of senses from sense-objects is of no avail, desire for enjoyment also must be annihilated. The characteristic of the ignorant is taste for objects; this desire is lost when the Supreme is seen "పరం దృష్ట్వా నివర్తతే".

దేహి:—The resident in the body *i e* the Jiva which entertains the worng conception that it is bound by a body.

పరం = Brahma

స్వభావప్రవృత్తం —one who acts according to one's own propencities, is రసః.

నిర్బీజం —the seed is the taste for the sensuous objects. The perception of the sensuous objects (విషయదర్శనం) has its cause in the taste for such objects This taste does not cease without the strong knowledge of the *self* [illegible]

యతతో హ్యపి కౌన్తేయ పురుషస్య విపశ్చితః ।
ఇంద్రియాణి ప్రమాథీని హరన్తి ప్రసభం మనః ॥ 60

---

టీక.

హే కౌంతేయ — ఓ కుంతీపుత్రుడా, యతతోఽపి — ప్రయత్నముచేయుచున్నవాడైనప్పటికిని, విపశ్చితోపి — విద్వాంసుడైనప్పటికిని, పురుషస్య — పురుషుని యొక్క, మనః — మనస్సును, ప్రమాథీని — క్షోభమును పెట్టునట్టిస్వభావముకల, ఇంద్రియాణి — ఇంద్రియములు, ప్రసభం — బలాత్కారముగా, హరంతిహి — హరించుచున్నవిగదా!

O son of Kunti, the afflictive senses forcibly carry away the mind of even a wise man, even though he strives to keep them away from the objects.

---

Com. భాష్య.

---

సమ్యగ్దర్శనలక్షణప్రజ్ఞాస్థైర్యం చికీర్షతా ఆదావింద్రియాణి స్వవశే స్థాపయితవ్యానియస్మాత్ తదనవస్థాపనే దోషమాహ—యతతోహీతి । యతతః

ప్రయత్నం కుర్వతః, హి యస్మాత్, హే కౌంతేయ పురుషస్య విపశ్చితో మేధావినో పి మనో పీతి వ్యవహితేన సంబంధః ఇంద్రియాణి ప్రమాథీని ప్రమథనశీలాని విషయాభిముఖంహి పురుషం విక్షోభయంతి ఆకులీకుర్వంతి ఆకులీకృత్యచ హరంతిచ ప్రసభం ప్రసహ్య॥

The senses should first be brought under control by one desirous of attaining to the steady knowledge characterised by the full realisation of the *self.* For, the Lord shows the harm resulting from the absence of such control, in the verse ' యతతో '. యతతః means striving. The senses have a tendency to worry. They inclite even the wise man to sensuous objects and agitate him, and having agitated his mind carry it away by force.

— ౧ —

తాత్పర్యము.

మనస్సు స్వాధీనముగా జేసికొనిన వివేకము స్థిరముగానుండు నుగాన ఇంద్రియనిగ్రహమువలన ప్రయోజనములేదని అర్జునుడడుగు నేమోయని కృష్ణుడీశ్లోకములో నింద్రియనిగ్రహము లేనియెడల గలుగుదోషమును జెప్పుచున్నాడు. ఆత్మానాత్మవివేకము స్థిరముగానుండుటకు ఇంద్రియనిగ్రహము ఆవశ్యకము. మాటిమాటికిని విషయములయందు దోషమును వెదకుటయను ప్రయత్నమును చేయునప్పటికిని అనవిషయదుఃఖములను తెలిసికొనినప్పటికిని బుద్ధిమంతుడైనప్పటికిని మిక్కిలక్షోభమును పెట్టునట్టి స్వభావముగలఇంద్రియములు విషయములకభిముఖముగా జేసి విక్షేపమునుబొందించి మనస్సును బలాత్కారముగా హరించును. కావున ఇంద్రియనిగ్రహము ఆత్మజ్ఞానము స్థిరముగానుండవలయుననియెడు తలంపుకలవానికి ఆవశ్యకము.

## *Notes.*

యతతః. The evils of un-controlled senses are shown in the [illegible] who repeatedly thinks of the transient and evil effects of sensuous objects is యతతః. Without the control of senses, the knowledge of the *self* cannot be steady.

ప్రమాథీని—The senses are very powerful and troublesome. They are compared to wild horses.

"మనః ప్రగ్రహమేవచ ఇంద్రియాణిహయానాహుర్విషయాంస్తేషుగోచరాన్".

The senses are the (wild) horses wandering away in pursuit of sensuous objects, which can be held in check by the reins of the mind. They carry away the mind into the filed of objects.

ప్రమాథీని = ప్రమథనంబుం విషయదర్శన మాత్రేణవ్యాకులీకర్తుం శీలంయేషాంతాని రాగాది దోషగ్రస్తాని.

హరంతి = వివేకయుక్తమపిమనః గృహీత్వా విషయేషుపాతయంతి.

---

తాని సర్వాణి సంయమ్య యుక్త ఆసీత మత్పరః ।
వశేహి యస్యేంద్రియాణి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥ 61

టీక.

యుక్తః = నిశ్చలచిత్తుడగు సంన్యాసి, తానిసర్వాణి = మిగులవిక్షోభము నుగలుగజేయునట్టి స్వభావముగల సకలేంద్రియములను, సంయమ్య = స్వాధీన ముగాజేసికొని, మత్పరః = వాసుదేవుడనయిననాయందు ఆసక్తిగలవాడై, ఆసీత = ఉండవలయును, యస్య = ఏసంన్యాసికి, ఇంద్రియాణి = ఇంద్రియములు, వశే = స్వాధీనమందు, వర్తంతే = ఉంచున్నవో, తస్య = అట్టిసంన్యాసికి, ప్రజ్ఞా = ప్రజ్ఞ, ప్రతిష్ఠితా = స్థిరమైనది.

Having controlled them all, the Yogi with steady mid, must rest intent on me. His knowledge becomes steady, who has a control over his senses.

— o —

**Com.** భాష్యం.

— o —

తాని సర్వాణి సంయమ్య సంయమనం వశీకరణం కృత్వా యుక్తః సమాహితః సంన్యాసీ మత్పరోఽహం వాసుదేవః సర్వప్రత్యగాత్మాపరో యస్య సమత్పరః నాన్యోఽహం తస్మాదిత్యాసదీత్యర్థః । ఏవమాసీనస్య యతేర్వశేహి యస్యేంద్రియాణి వర్తంతే అభ్యాసవశాత్ తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥

Having brought under control all the senses (తాని), the sanyasi of steady mind (యుక్తః) must remain intent on me with the conviction that he is no other that the Vasudeva who is the Prathyagathma or the *tnner self* of all. Thus knowledge of the sage who has controlled his passions by practice, is steady.

—— · o:: ——

తాత్పర్యము.

---

ఇంద్రియములను స్వాధీనముచేసికొనినపిమ్మట జేయదగినకార్యమేదియని అర్జునుడు అడుగునేమోయని తలచి చేయతగినకార్యమును కృష్ణుడీశ్లోకములోచెప్పుచున్నాడు. సకలేంద్రియములను స్వాధీనముగాజేసికొని నిశ్చలచిత్తుడవైసర్వమునువదలుకొని (సంన్యాసి) వాసుదేవుడే సర్వాత్మస్వరూపుడనియును, వాసుదేవునికంటె నితరమేమియులేదని తలచుచున్నవాడునునై యుండవలయును. మరియును ఏసంన్యాసికి అభ్యాసవశముచేత ఇంద్రియము స్వాధీనములో అట్టివానికి వివేకజ్ఞానము స్థిరముగానుండును.

## *Notes.*

This verse gives the answer to the question 'వాసీత' put in the verse 54.

యుక్తః = యోగసయుక్తః = సమాహితః = నిశ్చలచిత్తుడు.

మత్ పరః = అహమేవపరః పరమాత్మేతి పరస్మిన్నేవ బ్రహ్మణి అహం ధీరస్య సః = మత్పరః.

అభ్యాసవశాత్.—విషయములయందలి దోషమును మాటిమాటికి కనిపెట్టి ఇంద్రియములను విషయములమీదికి పోకుండునట్లుచేసి నేను పరమాత్మకంటె భిన్నుడనుకానని తలచి అభ్యాసముచేయుచున్న సంన్యాసికి జ్ఞానము స్థిరముగానుండును.

మత్పరః —ఈశ్లోకములో "యుక్తఆసీతమత్పరః" అనునది "కిమాసీత" అనుప్రశ్నకు సమాధానము. మరియును ఇంద్రియములను జయించినవానికేతప్ప తక్కిన వారలకు ఆత్మానాత్మవివేకజ్ఞానము స్థిరముగానుండదని ఈశ్లోకముచెప్పుచున్నది.

---

ధ్యాయతో విషయాన్ పుంసః సంగస్తేషూపజాయతే।
సంగాత్ సంజాయతేకామః కామాత్ క్రోధోఽభిజాయతే॥ 62

టీక.

విషయాన్ = లోకపదార్థములనుగురించి, ధ్యాయతః = ఆలోచించుచున్న, పుంసః = పురుషునకు, తేషు = ఆవిషయములయందు, సంగః = ఆసక్తి, ఉపజాయతే = పుట్టుచున్నది. సంగాత్ = ఆవిషయాసక్తివలన, కామః = కోరిక, సంజాయతే = పుట్టుచున్నది, కామాత్ = ఆశవలన, క్రోధః = క్రోధము, అభిజాయతే = పుట్టుచున్నది.

In the man who always thinks of sinse-objects, attachment (for them) arises; from attachmen desire arises; from desire comes forth wrath.

———:0:———

**Com.** భాష్యం

———::0::———

అథేదానీం పరాభవిష్యతః సర్వానర్థమూలమిదముచ్యతే ధ్యాయతఇతి। ధ్యాయతః చింతయతో విషయాన్ శబ్దాది విషయవిశేషాన్ ఆలోచయతః పుంసః పురుషస్య సంగః ఆసక్తిః ప్రీతిః తేషు విషయేషు ఉపజాయతే ఉత్పద్యతే సంగాత్ ప్రీతేః సంజాయతే సముత్పద్యతే కామః తృష్ణా తస్మాత్ కామాత్ కుతశ్చిత్ ప్రతిహతాత్ క్రోధోఽభిజాయతే ॥

Afterwards (అథ), the Lord now points out that attachment is the root of all evils, in the words of the verse 'ధ్యాయత', in the case of one who is frustrated in his object of sense-control (పరాభవిష్యతః). When a man thinks of the Various virtues of the sensuous objects, he conceives attachment for them; from attachment arises thirst for them and from desires frustrated or unfulfilled by some one, springs up anger.

———::0::———

తాత్పర్యము.

పురుషార్థమైన యాత్మజ్ఞానమును పొందుటకు తగినయుపాయమును ఉపదేశించినపిమ్మట (అథ) శ్రీకృష్ణుడు జ్ఞాననిష్ఠనుపొందని ఇంద్రియములచేత అవమానింపబడినవానికి గలుగు సర్వానర్థకారణముయిన సంగతిని ఈశ్లోకము మొదలు రెండుశ్లోకములచేత తెలియజేయుచున్నాడు. లోకములో ఎవనికి శబ్దాదిపదార్థ

ముఱియొక్క రమ్యత మొదలగు విశేషములనుగురించి సర్వదా ఆలోచించునో వానికి ఆపదార్థములయందు సాధారణమైన యాసక్తి అనగా యీవిషయములు నాకు సుఖకారణములనుతలంపుకలుగును. అట్టియాసక్తిచేత క్రమముగా విశేషమైనయాశ అనగా నాకిఇవిముఖ్యముగా కావలయుననుతలంపు కలుగును. అట్టియాశ లోకములో నెవ్వనివలననైనను, ఏకారణమువలననైనను అడ్డగింపబడినప్పుడు కోపముపుట్టును.

*Notes.*

అథ = Afterwords, *i. e.*, after the Lord has pointed the distinguishing attributes of the sanyasi and the means of attaining them.

మూలం:— the root of all evils is attachment for objects.

సంగః :— The control of the outer senses has been taught in the previous verses. If the inner sense, the mind, is not controlled all the evils arise So the conquest of mind is absolutely necessary and is therefore taught in this and the next verses. To think of the sensuous objects, which is the act of mind, is the root-evil.

ధ్యాయతః = విషయేషు రమ్యత్వమరమ్యత్వం వ, ఇదం భోగ్యమితి వా చింతయంతః.

క్రోధః = కామప్రకారకరణహేతు విశేషం.

క్రోధాద్భవతి సంమోహః సంమోహాత్ స్మృతివిభ్రమః ।
స్మృతిభ్రంశాద్బుద్ధినాశో బుద్ధినాశాత్ ప్రణశ్యతి ॥ 63

టీక.

క్రోధాత్ = క్రోధమువలన, సంమోహః = అవివేకము, భవతి = అగుచున్నది సమ్మోహాత్ = వివేకశూన్యమువలన, స్మృతివిభ్రమః = గురూపదిష్ట మార్గస్మృతినాశనము, భవతి = అగుచున్నది. స్మృతిభ్రంశాత్ = స్మృతినశించుటవలన, బుద్ధినాశః = బుద్ధియొక్క నాశము, భవతి = అగుచున్నది. బుద్ధినాశాత్ = బుద్ధియందుచెడుటవలన, ప్రణశ్యతి = నశించుచున్నాడు.

From anger proceeds indiscrimination; from indiscrimination, failure of memory; from loss of memory, the loss of right

understanding; and from the destruction of right understanding, he is totally riuned.

———:o:———

## Com. భాష్యం.

———:.o.:———

క్రోధాద్భవతి సంమోహః సంమోహోఽవివేకః కార్యాకార్యవిషయ వివేకః భవతీతి సంబధ్యతే క్రుద్ధోహి సంమూఢః సన్ గురుమప్యాక్రోశతి సంమోహాత్ స్మృతివిభ్రమః శాస్త్రాచార్యోపదేశాహితసంస్కారజనితాయాః స్మృతేః స్యాద్విభ్రమో భ్రంశః స్మృత్యుత్పత్తినిమిత్తప్రాప్తౌ అనుత్పత్తిః స్మృతిభ్రంశాత్తు బుద్ధేర్నాశః కార్యాకార్యవిషయవివేకాయోగ్యతా అంతఃకరణస్య బుద్ధేర్నాశః ఉచ్యతే బుద్ధినాశాత్ ప్రణశ్యతి తావదేవహి పురుషో యావదన్తఃకరణం తదీయం కార్యాకార్యవిషయవివేకయోగ్యం తదయోగ్యత్వే నష్టఏవ పురుషో భవత్యతః తస్యాంతఃకరణస్య బుద్ధేర్నాశాత్ ప్రణశ్యతి పురుషార్థాయోగ్యో భవతీత్యర్థః ॥

From anger proceeds delusion which consists in the want of discrimination as to what ought to be done and what ought not to be done. For, when one is overtaken by anger, he becomes so stupid as to offer idignity even to his Guroo. From non-discrimination arises the failure of memory of things impressed upon him by the teachings of the preceptors and the study of Sastras; భ్రంశం is to be understood in the sense of absence of the rise of reminiscenses, [illegible] the existence of the cause of reminiscences. From the loss of memory arises the loss of Budhi i. e, the incapacity of the Antahkarana to discriminate between right and wrong, from the loss of Budhi he becomes ruened. Man is fite to be man only so long as his inner-sense (అంతఃకరణ is capable of discriminating, between right and wrong. When it is wanting in that capacity the man becomes lost as it were. Thus by the loss of Budhi or his Antahkarana, he is ruined *i e* he becomes unfit for achieving the object of man.

———.:0..———

## తాత్పర్యము.

తాను కోరినకోరికలు నెరవేరకపోవుటవలనగలిగిన కోపమువలన అవివేకము అనగా (ఈకార్యము చేయతగినది, ఈకార్యము చేయదగినదికాదు అనునట్టి తెలివిలేకపోవుట) సంభవించుచున్నది. లోకములో కోపపరవశుడు గురువునుగూడ నిందించును. అవివేకమువలనను, శాస్త్రమును చదువుటవలనను, సద్గురూపదేశమును పొందుటవలనను మొదలగు సంస్కారములవలనగలిగిన స్మృతి నశించిపోవుచున్నది. అనగా జ్ఞప్తినచ్చుటకు తగిన కారణములున్నప్పటికిని జ్ఞప్తిరాకపోవుట సంభవించుచున్నది స్మృతినాశనమువలన ఈకార్యము చేయతగినది, ఈకార్యము చేయదగినదికాదు అని తెలిసికొనుటకు యోగ్యతలేకపోవుటయను బుద్ధినాశనము సంభవించుచున్నది. బుద్ధినాశనమువలన పురుషుడు నశించుచున్నాడు. అనగా అంతఃకరణము (బుద్ధి) ఎంతకాలము దనుక కార్యాకార్యములను, యుక్తాయుక్తములను తెలిసికొనుటకుదగిన వివేకముకల్గియుండునో అంతకాలముదనుక పురుషుడు పురుషార్థముగలవాడగుచున్నాడు. ఎవ్వడు పురుషార్థహీనుడగుచున్నాడో వాడు బ్రతికియుండియును చచ్చినవానితో సమానుడగుచున్నాడు గనుక బుద్ధినాశనమువలన నశించిపోవుచున్నాడు. అనగా పురుషార్థహీనుడగుచున్నాడు.

### *Notes.*

The reasoning in the verse has been fully explained in the telugu portion of the Bhashyam.

బుద్ధిః :— Capacity to understand what is right and wrong.

సమ్మోహః = కార్యాకార్యవివేకాభావః

విభ్రమః = శాస్త్రాచార్యోపదిష్టార్థస్మృతేః విచలనం.

ప్రణశ్యతి = మృతతుల్యోభవతి.

ప్రణశ్యతి :— Man is said to perish when his mind loses the capacity to discriminate between right and wrong. It is this capacity that renders man a man.

రాగద్వేషవియుక్తైస్తు విషయానింద్రియైశ్చరన్ ।
ఆత్మవశ్యైర్విధేయాత్మా ప్రసాదమధిగచ్ఛతి ॥ 64

టీక.

రాగద్వేషవియుక్తైః = రాగ - అభిలాషము, ద్వేష - అప్రియము, ఈ రెంటిచేతను, వియుక్తైః - విడువబడినవిగనుకనే, ఆత్మవశ్యైః = మనస్స్వాధీనములయిన, ఇంద్రియైః = ఇంద్రియములచేత, విషయాన్ = ఇంద్రియవిషయములను, చరన్ = అనుభవించుచున్న, విధేయాత్మాతు = స్వాధీనమయినమనస్సుగలవాడు, ప్రసాదం = చిత్తనిర్మలత్వమును, అధిగచ్ఛతి = పొందుచున్నాడు.

He, who moves among the sensuous objects with senses controlled by the mind and devoid of attachment and aversion, and who is of controlled mind, (విధేయాత్మ) attains tranquillity

———;:o::———

**Com.** భాష్యం.

———:o:———

సర్వానర్థస్య మూలముక్తం విషయాభిధ్యానం అథేదానీం మోక్షకారణమిదముచ్యతే—రాగేతి। రాగద్వేషవియుక్తైః రాగశ్చ ద్వేషశ్చ రాగద్వేషౌ తత్పురస్సరాహీంద్రియాణాం ప్రవృత్తిః స్వాభావికీ తత్ర యో ముముక్షుర్భవతి స తాభ్యాం వియుక్తైః శ్రోత్రాదిభిరింద్రియైః విషయానవర్జనీయాన్ అశనపానాదీన్ దేహస్థితిహేతూంస్తానపి చరన్నుపలభమానః ఆత్మవశ్యైరాత్మనో వశ్యైర్వశీభూతాని తైరాత్మవశ్యైః విధేయాత్మా ఇచ్ఛాతో విధేయా ఆత్మా అన్తఃకరణం యస్య సోఽయం ప్రసాదమధిగచ్ఛతి। ప్రసాదం ప్రసన్నతాం స్వాస్థ్యం॥

Thinking about the sensuous-objects has been said to be the root of all evils (in *v.* 62). Now the means of attaining emancipation (మోక్ష) is here described. Naturally the senses exhibit activity when prompted by love or hatred for objects. So he who is desirous of obtaining the final release (ముముక్షుః) should enjoy objects which are unavoidable as being the cause of bodily sustenance, such as eating, drinking &c., with his senses hearing &c., devoid of attachment and aversion and controlled by mind. Such a man with his mind purified and controlled attains steadiness and tranquillity.

## తాత్పర్యము.

విషయములను స్మరించుటచేత అనర్థమువచ్చునేని విషయములను అనుభవించుటచేత అనర్థముముఖ్యముగా వచ్చియేతీరునుగదా? కావున జీవించియుండుటకు దగిన యన్నపానాదులను భుజించుటచేతమాత్రము అనర్థమునుపొందదా? అనిఅర్జునునకు అడుగునేమోయనితలచి అందుకుతగిన సమాధానముచెప్పుచు మోక్షకారణమునుగూడ కృష్ణుడు చెప్పుచున్నాడు. ఇంద్రియములు రాగద్వేషములు కలవగుచునే విషయములకొరకుపోవును. కావున ముముక్షువగువాడు ఇంద్రియములను రాగద్వేషములులేనివానినిగాజేసి ప్రాణసంరక్షణమునకుమాత్రము అత్యావశ్యకమైనవియును కావున త్యజించుటకు వీలులేనివియును అయిన శబ్దాదివిషయములను స్వాధీనమైన అంతఃకరణముగలవాడై అనుభవింపవలయును. ప్రాణసంరక్షణమునకుమాత్రము తగినవిషయములను అనుభవించునపుడుగూడ ఇంద్రియమనోజయముకలవాడు శాంతిని బొందుచున్నాడు

---

*Notes.*

ప్రవృత్తిః = activity; స్వాభావికా = natural.

విషయాన్ = unavoidable objects such as eating, drinking &c., అశాస్త్రరసాదీననిషిద్ధాన్.

తత్ర = among them.

విధేయాత్మా:—విధేయః ఇంద్రియశుద్ధ్యా సమాధినా చ నిర్ముక్తరాగాది దోషతయా శుద్ధత్వేన స్వాధీనః ఆత్మా మనోయస్య సవిధేయాత్మా.

The Yathi whose mind is controlled and purified from the impurities of love, hatred &c., through the purity of the senses and contemplation is విధేయాత్మా

ఇంద్రియములు మనస్సునకు లోబడియున్నప్పటికిని, మనస్సు నియమములేనిదైయుండెనేని, ఆమనస్సునకు లోబడిన ఇంద్రియములుగూడ నియమములేనివైయుండునని మనస్సు స్వాధీనమైయుండవలయునని తెలియజేయుటకు 'విధేయాత్మా' యనిచెప్పబడినది.

ఇంద్రియశుద్ధిచేత చిత్తశుద్ధికలుగును. "ఆహారశుద్ధౌ సత్వశుద్ధిః సత్వశుద్ధౌ ధ్రువా స్మృతిః" (ఆహారశుద్ధికలుగుటచేత చిత్తశుద్ధికలుగును. చిత్తశుద్ధికలుగుచుండగా వేదాంతవాక్యములను సద్గురువువలన వినుటచేతకలిగిన బ్రహ్మజ్ఞానము ఎడతెగక స్మరణకువచ్చును).

This and the following seven verses give reply to the question ' కిం వ్రజేత '.

పురస్సరాహి ఇంద్రియాణాం:—హి = అందరుకు అనుభూతవిషయమే—' అనుభవ దర్శనార్థోహి శబ్దః '

అథేదానీం:—అథ అనంతరము అనగా అనర్థమూలకథనానంతరము.

---

ప్రసాదే సర్వదుఃఖానాం హానిరస్యోపజాయతే।
ప్రసన్నచేతసోహ్యాశు బుద్ధిః పర్యవతిష్ఠతి ॥ 65

---

టీక.

అస్య = ఈయోగికి, ప్రసాదేసతి = చిత్తశుద్ధికలుగుచుండగా, సర్వదుఃఖానాం = సమస్తమైనకష్టములకు, హానిః = నాశము, ఉపజాయతే = పుట్టుచున్నది, ప్రసన్నచేతసః = నిర్మలమయినమనస్సుగలపురుషునకు, ఆశు = త్వరితముగా, బుద్ధిః = నిశ్చయాత్మకబుద్ధి, పర్యవతిష్ఠతి - స్థిరముగానిలుచుచున్నది.

In the Yathi (అస్య) who obtains the tranquillity of mind, the destruction of all evils comes about and the knowledge of the man of tranquil mind soon becomes steady.

-:o:-

## Com. భాష్యం.

-::o::-

ప్రసాదేసతి కింస్యాత్ ఇత్యుచ్యతే। ప్రసాదఇతి। ప్రసాదే సర్వదుఃఖానాం ఆధ్యాత్మికాదీనాం హానిః వినాశః। అస్య యతేః ఉపజాయతే। కిఞ్చ ప్రసన్నచేతసః శుద్ధాన్తఃకరణస్య హి యస్మాదాశు శీఘ్రం బుద్ధిః పర్యవతిష్ఠతి ఆత్మస్వరూపేణైవ నిశ్చలాభవతీత్యర్థః। ఏవం ప్రసన్నచేతసః అవస్థితబుద్ధేః కృతకృత్యతా యతస్తస్మాద్రాగద్వేషవిముక్తైరింద్రియైః శాస్త్రావిరుద్ధేషు అవర్జనీయేషు యుక్తః సమాచరేదితి వాక్యార్థః॥

It is stated in the verse ' ప్రసాదే ' what the result would be, if peace is obtained. On the possession of tranquillity, the destruction of all evils such as belong to the body &c., (ఆధ్యాత్మిక) happens in the case of Yathi. For, the knowledge of the Yathi of

pure heart, soon becomes steady, becoming all pervasive *i. e.*, it remains stable, in the contemplation of the form of the *self* (ఆత్మ). The purport of the passage is this—The man of tranquil and pure heart and of steady knowledge obtains the accomplishment of his desired object. Wherefore the self-controlled man has to enjoy objects indispensable to existence and unprohibited by the Sastras, with the senses devoid of attachment and aversion.

-::o::-

## తాత్పర్యము.

---

శాంతిని పొందునని చెప్పితివిగదా. ప్రసాదమును పొందుటవలన ఏమిలాభముకలుగునని అర్జునుడు అడుగునేమోయనితలచి మనస్సు నిర్మలమయినదయ్యేని ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, ఆధిదైవికము అనునట్టిదుఃఖములు నశించును. ఆధ్యాత్మికాది ప్రతిబంధకము పోవుటవలన బుద్ధియనునది శీఘ్రముగా సర్వవ్యాపియగు ఆకాశమువలెనే సర్వత్ర నిండియున్న బ్రహ్మాకారమునుపొంది నిశ్చలమయినదగును. సర్వవిషయమును ఆలోచించిచూడగా నిర్మలమును నిశ్చలమును అయిన మనస్సుకలవాడు (చిత్తముకలవాడు) ధన్యుడగునుగనుక రాగద్వేషరహితమైన ఇంద్రియములచేత శాస్త్రవిరుద్ధములుకానివియును, ప్రాణమును సంరక్షించుకొనుటకు మాత్రము తగినవై విడిచిపెట్టుటకు వీలుగానివియును అయిన విషయములయందు సమాహితచిత్తుడై (విషయములు నాకుండియేతీరవలయునని యెడు తలంపులేనివాడై) సంచరించవలయును.

*Notes.*

ప్రసాదే:— Two results accrue from the purity of mind, (1) The destruction of miseries, (2) the understanding takes the form of the general knowledge of the unity of *self* everywhere చిత్తశుద్ధివలన సకలదుఃఖనాశనము, బుద్ధిబ్రహ్మాకారముపొందుటయును కలుగును.

బుద్ధిః = సర్వత్రబ్రహ్మదర్శినీ ప్రజ్ఞా.

ప్రసన్నచేతసః = నిర్మలాత్మనః.

యుక్తః = సమాహితః = విషయపారవశ్యశూన్యః.

నా స్తి బుద్ధిరయు క్తస్య నచాయు క్తస్య భావనా।
నచాభావయతశ్శాంతిరశా న్తస్య కుతస్సుఖం॥ 66

---

టీక.

అయు క్తస్య = చి త్తశుద్ధిలేనియతికి, బుద్ధిః= ఆత్మజ్ఞానము, నా స్తి= లేదు, (ఇంతియకాక) అయు క్తస్య = చి త్తశుద్ధిలేనియోగికి, భావనాచ = ఆత్మజ్ఞానమందభినివేశమును, (బ్రహ్మజ్ఞానమును సాధించుకొనవలయుననుగట్టిశపథముతో తనను బ్రహ్మనుగాధ్యానముచేయుటయును), నా స్తి = లేదు, అభావయతశ్చ = బ్రహ్మభావనచేయనివానికి, శా న్తిః= బాహ్యపదార్థములమీదికి మనస్సుపోకుండుట, నా స్తి = లేదు, అశా న్తస్య = బాహ్యపదార్థములమీదికి బుద్ధినిపోకుండునట్లుచేయనివానికి, సుఖం = సుఖము, కుతః= ఎట్లాగున, భవతి= అగుచున్నది.

There is no discriminative knowledge to the unbalanced minded man, nor is there contemplation (of his being one with Brahma భావనా) to him; and there is no peace to the uncontemplative, and for the peaceless, how can there be happiness!

———::o::———

**Com.** భాష్యం.

-::o::-

సేయం ప్రసన్నతా స్తూయతే। నా స్తీతి। నా స్తి నవిద్యతే నభవతీత్యర్థః బుద్ధిరాత్మస్వరూపవిషయా అయు క్త స్య అసమాహితా న్తఃకరణస్య నచాయు క్త స్యేతి నచాస్య అయు క్తస్య భావనా ఆత్మజ్ఞానాభినివేశః తథాచ నాస్యభావయతః ఆత్మజ్ఞానాభినివేశమభికుర్వతః శా న్తిరుపశమో నవిద్యతే। అశా న్తస్య కుతః సుఖం ఇంద్రియాణాంహి విషయసేవా తృష్ణాతోనివృ త్తిర్యా తత్ సుఖం న విషయవిషయా తృష్ణా దుఃఖమేవహి సా నతృష్ణాయాం సత్యాం సుఖస్య గంధమాత్రమపి ఉత్పద్యతఇత్యర్థః॥

In the words of the verse 'నాస్తి' tranquillity of mind is extolled. బుద్ధిః means the knowledge about the true nature of the self. అయుక్తస్య means to one of unsteady mind; భావనా means meditation that he is the Brahman, with the determination of attaining to knowledge (అభినివేశం). To him who is without intense contemplation for

the knowledge of the self, there can be no peace; and to the peaceless how can there be happiness. That is the true happiness which consists in the retirement of the senses from the thirst for *the enjoyment* of the objects and not from the thirst for objects. This last is mere misery. So long as this thirst exists, there cannot be even a spice of happiness.

—::o::—

## తాత్పర్యము.

చిత్తశుద్ధివలననే ఆత్మానాత్మవివేకజ్ఞానము స్థిరముగానుండకపోయినను అట్టిజ్ఞానమునకు సాధనమగుచున్నది గనుక చిత్తస్థైర్యము శుద్ధియు సర్వోత్తమములైనవని యీశ్లోకము చెప్పుచున్నది. చిత్తశుద్ధిలేనివానికి వేదాంతవాక్యశ్రవణమువలన సామాన్యముగా నేను బ్రహ్మనైతిననియెడుబుద్ధికలిగినను నిశ్చయముగా నేను బ్రహ్మనయితిననియెడు ఆత్మస్వరూపబుద్ధికలుగనేరదు. అట్టిచిత్తశుద్ధిలేనియంతఃకరణముకలవానికి బ్రహ్మజ్ఞానమును సంపాదించుకొనవలయునని పట్టుదలతో మాటిమాటికిని తనను బ్రహ్మముగా ధ్యానించుటతటస్థించదు. అట్టిఆత్మజ్ఞానాభినివేశములేనివానికి చిత్తశాంతి అనగా బాహ్యపదార్థములమీదికి మనస్సు పోకుండుట గలుగదు. అట్టిశాంతిలేనివానికి ఆనందసముద్రముకలుగక సంసారములో మునుగుచు మోక్షరూపమగు పరమసుఖముకలుగనేరదు. ఇంద్రియములను విషయములమీదికిపోనిచ్చిన మోక్షసుఖము లేకపోవచ్చును. వైషయికసుఖము (బాహ్యపదార్థములను అనుభవించుటయను సుఖము) కలుగవచ్చును అనుప్రశ్నకు సమాధానమివ్వబడుచున్నది. ఇంద్రియములను విషయానుభవతృష్ణనుండి మరలించుటయేసుఖము. విషయములమీదికి బోనిచ్చుట దుఃఖము. విషయములయందాశకలిగియుండగా సుఖముయొక్క గంధమాత్రము (లేశమాత్రము) కూడయుండదు.

---

## *Notes.*

### శ్లోకసారము

చిత్తశుద్ధిలేనివానికి ఆత్మజ్ఞానచింతయుండదు. అట్టిభావనలేనివానికి శ్రవణమనననిదిధ్యాసలను మాటిమాటికిని చేయుటయనెడు సంస్మరణముకలుగదు; అట్టిస్మరణముచేయనివానికి ఆత్మా

పరోక్షజ్ఞానము కలుగదు. అట్టిజ్ఞానహీనునకు చిత్తశాంతి (బాహ్యపదార్థములమీదికి మనస్సు పోకుండుట) కలుగదు. శాంతిహీనునకు మోక్షరూపసుఖము కలుగదు.

అశాంతస్య = బ్రహ్మభావమప్రాప్తస్య

సుఖం = బ్రహ్మసుఖం.

---

ఇంద్రియాణాంహి చరతాం యన్మనోనువిధీయతే।
తదస్య హరతి ప్రజ్ఞాం వాయుర్నావమివాంభసి ॥ 67

టీక.

హి = ఏకారణమువలన, ఇంద్రియాణాం = ఇంద్రియములు, చరతాం సతాం = (విషయములయందు) తిరుగుచుండగా, యత్ = ఏ, మనః = మనస్సు, అనువిధీయతే = అనుసరించిప్రవర్తించుచున్నదో, తత్ = ఆమనస్సు, అస్య = ఈ యోగియొక్క, ప్రజ్ఞాం = ఆత్మానాత్మవివేకముపలనగలిగినజ్ఞానమును, వాయుః = గాలి, అంభసి = ఉదకమునందు, నావమివ = ఓడనువలెనే, హరతి = ఆకర్షించుచున్నది.

The mind which follows the senses as they rove amid the sense-objects, carries away the discriminative knowledge of the Yathi (అస్య) just as a gale carries away a ship (out of its course) on waters.

:o::

**Com.** భాష్యం.

::o::

అసమాహితస్య కస్మాద్బుద్ధిర్నాస్తీతి ఉచ్యతే। ఇంద్రియాణామితి। ఇంద్రియాణాం హి యస్మాచ్చరతాం స్వవిషయేషు ప్రవర్తమానానాం యన్మనోనువిధీయతే। అనుప్రవర్తతే తదింద్రియవిషయవికల్పనేన ప్రవృత్తం మనః అస్య యతేః హరతి ప్రజ్ఞాం ఆత్మానాత్మవివేకజాం నాశయతీకథం వాయుర్నావమివాంభసి ఉదకే జిగమిషతాం మార్గాదుద్ధృత్య ఉన్మార్గే నావం యథా వాయుః ప్రవర్తయతి ఏవమాత్మవిషయతాం ప్రజ్ఞాం హృత్వా మనోవిషయాం కల్పనాం కరోతి ॥

In the verse 'ఇంద్రియాణాం...' it is stated why no knowledge arises to one of unsteady mind When the mind goes after the senses as they are engaged in pursuit of their respective objects *i. e.*, when the mind is busy thinking of the various objects of the senses, it destroys the knowledge due to the discrimination of the *self* and the *non-self.* In what manner? Just as a gale carries away a ship on waters out of its intended path and leads it on astray, so the mind destroying the discriminative knowledge about the Atma, only thinks of its own objects.

—— o ——

తాత్పర్యము.

మనస్సు విషయములమీదికి పోకుండునట్లు చేయనివానికి వివేకబుద్ధిలేక పోవుటకు కారణమేమియని అర్జునుడడుగునేమోయని చిత్తవిక్షేపముకలుగగానే (విషయములమీదికి మనస్సునుపోనిచ్చినవానికి) భావనయుండదుకనుక ఆత్మసాక్షాత్కారమునుచేసికొనుటకు అనుకూలమైనబుద్ధియుండదని కృష్ణుడు యీశ్లోకములో చెప్పుచున్నాడు. ఇంద్రియములు వాటివాటివిషయములమీదికి పోయినప్పుడు మనస్సుకూడ ఆయింద్రియములననుసరించి విషయములను వేరువేరుగాఅనుభవించుచుండెనేని సముద్రముమీదబోవుచున్నయోడను వాయువుదానియిష్టమార్గమునుంచి తప్పించి పెడమార్గమునుపట్టించినరీతిని ఆత్మసాక్షాత్కారముకు దగినదియగు ఆత్మానాత్మవివేకజన్యమైన ప్రజ్ఞను నశింపజేసి శబ్దాదివిషయములను గోచరముగాజేసికొనుటకు దగినజ్ఞానమును కలుగజేయును.

## *Notes*

This verse affords an illustration to show that no knowledge arises to one of unsteady mind "విక్షిప్తచేతసా భావనాభావే సాక్షాత్కారలక్షణాద్ధిం నభవతీతి హేతుత్వం దృష్టాంతేనసాధయతి".

వికల్పం = మిథోవిభజ్య గ్రహణం = చెవులుమొదలుగాగల ఇంద్రియములకు విషయములయిన శబ్దాదులను వేరువేరుగా విభజించి అనుభవించుట.

అంశః :— What is the propriety of saying that a gale leads astray a ship *on waters?* Water is mobile and easily flowing

having less cohesion; so when mind is fickle and mobile, it possesses the capacity to destroy knowledge but when it is firm *like earth* it cannot do so. Hence to indicate that when mind is unsteady, it can destroy knowledge, the word అంభసి is used.

ప్రతికూలవాయువు యోడను సుడిగుండమునందు బడవేయవచ్చును, పర్వతమునకు డ గిలించవచ్చును. ఆరీతిగానే మనస్సు యతియొక్క జ్ఞానమును హరించి విషయములయందైనను, కర్మమునందైనను, వ్యవహారమునందైనను ప్రవేశపెట్టును.

తస్మాద్యస్య మహాబాహో నిగృహీతాని సర్వశః ।
ఇన్ద్రియాణీన్ద్రియార్థేభ్యస్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥ 68

టీ.

హే మహాబాహో – ఓ గొప్పబాహువులు గలిగినయట్టి అర్జునుడా, తస్మాత్ – అందుకారణమువలన, యస్య – ఏ యతియొక్క. ఇంద్రియాణి ఇంద్రియములు, ఇంద్రియార్థేభ్యః విషయములనుండి, సర్వశః – అన్నివిధములచేతను, నిగృహీతాని – నిగ్రహింపబడినవి, భవంతి – అగుచున్నవో, తస్య – ఆ యతియొక్క, ప్రజ్ఞా (ఆత్మానాత్మవివేకములవలనగలిగిన) జ్ఞానము, ప్రతిష్ఠితా – స్థిరమయినది, (భవతి – అగుచున్నది).

Therefore, O mighty-armed, his discriminative knowledge is steady, who controls in every way his senses from straying into sensuous objects.

———— 0. ————

**Com.** భాష్య.

———— 0 ————

యతో వ్యాఖ్యా [illegible] దోషః [illegible] నువాక్యాత [illegible] పరిహారః । [illegible] ఇంద్రియాణాం ప్ర[illegible] యస్మాత్ తస్మాద్యస్య [illegible] హే మహాబాహో [illegible] సర్వ[illegible] [illegible] యాణీంద్రియార్థేభ్యః త[illegible] [illegible] హేతుం ఉపపన్నః [illegible] [illegible] తే ॥

The subject treated of by the verse 'యతతోహ్యపి...' (అ. 2 శ్లో 60) and subsequently discussed in its various aspects, concludes with the present verse. The evils arising from the senses engaged in pursuit of the sense-objects have been shown. Wherefore the knowledge of the Yathi who restrains in all the ways *i. e.*, by speech, mind and body, the senses from the sense-objects such as sound &c., is steady.

——::o::——

తాత్పర్యము.

యతతోహ్యపికౌంతేయ అనుశ్లోకముచేత చెప్పబడిన విషయమును అనేకవిధములయిన యుపపత్తులతో చెప్పి ప్రకృతశ్లోకములో ఆయర్థమును ప్రతిపాదించి ముగించుచున్నాడు. సకలేంద్రియములను విషయములమీదికిబోకుండునట్లు మనోవాక్కాయకర్మములచేత చేయునట్టియతికి ఆత్మానాత్మవివేకమువలన గలిగిన జ్ఞానము స్థిరమైయుండును.

*Notes.*

మహాబాహో :— Being mighty-armed, Arjuna can conquer his foes; so he is qualified to conquer the enemies in the shape of love, hatred &c. "రాగాదిశత్రుసంహారసమర్థస్యైవఅత్రఅధికారోనాన్యస్యేతి సూచనార్థం మహాబాహోఇతిసంబోధనమ్".

సారము.

రాగద్వేషలోభములను కలిగియుండుటచేత ఇంద్రియములు విషయములమీదికిబోవును. అందువలన సమాధిసిద్ధింపదు. అందువలన జ్ఞానముకలుగదు. జ్ఞానములేకపోవుటచేత నేను బ్రహ్మనయితినన్నతలంపుకలుగదు. అందువలన ముక్తికలుగదు. ముక్తిలేకపోవుటచేత పరమసుఖముండదు.

---

యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ।
యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః॥ 69

టీక.

యా = (ఆత్మనుగోచరముగాజేసికొనునట్టి) ఏబుద్ధి, (లేక) ఏబ్రహ్మనిష్ఠ, సర్వభూతానాం = (అవివేకులయిన) సకలప్రాణులకును, నిశా = (గోచరముకా

కపోవుటవలన) రాత్రివలెప్రకాశములేనిది, (భవతి = అగుచున్నదో), తస్యాం = (ఆత్మను గోచరముగాజేసికొనునట్టి) ఆబుద్ధియందు, (లేక) బ్రహ్మనిష్ఠయందు, సంయమీ = ఇంద్రియనిగ్రహముకలపురుషుడు, జాగర్తి = మేలుకొనుచున్నాడు, యస్యాం = (శబ్దాదివిషయములను గోచరముగాజేసికొనునట్టి) ఏబుద్ధియందు, (లేక) ఏఅజ్ఞానావస్థయందు, భూతాని = (అవివేకులయిన) సకలప్రాణులును, జాగ్రతి = మేలుకొనుచున్నారో, సా = (శబ్దాదులను గోచరముగజేసికొనునట్టి) ఆబుద్ధి, (లేక) ఆయజ్ఞానావస్థ, పశ్యతః = (ఆత్మతత్త్వమును) చూచుచున్న, మునేః = మునివరునకు, నిశా = (అవిద్యాస్వరూపమగుటవలన) రాత్రివలెప్రకాశము లేనిది, (భవతి = అగుచున్నది).

What is night to all beings is waking to the *self-controlled* Yathi; when the beings keep awake then it is night to the sage, the seer.

——::o::——

## Com. భాష్యం.

-:o:-

అవిద్యాయాశ్చ విద్యావిరోధాత్ నిత్యన్మత్రిత్యేతమర్థం స్ఫుటీకుర్వన్నాహ—యేతి। యా నిశా రాత్రిః సర్వపదార్థానామవివేకకరీ తమః స్వభావత్వాత్ సర్వభూతానాం సర్వేషాం భూతానాం కిం తత్పరమార్థతత్త్వం స్థితప్రజ్ఞస్య విషయః యథా నక్తంచరాణాం అహరేవ సదన్యేషాం నిశా భవతి। తద్వన్నక్తంచరస్థానీయానామజ్ఞానినాం సర్వభూతానాం నిశేవ నిశా పరమార్థతత్త్వం అగోచరత్వాదతద్బుద్ధీనాం తస్యాం పరమార్థతత్త్వలక్షణాయాం అజ్ఞాననిద్రాయాం ప్రబుద్ధః జాగర్తి। సంయమీ సంయమవాన్ జితేంద్రియో యోగీత్యర్థః। యస్యాం గ్రాహ్యగ్రాహకభేదలక్షణాయామవిద్యానిద్రాయాం ప్రసుప్తాన్యేవ భూతాని జాగ్రతీత్యుచ్యంతే। ప్రసుప్తాఇవ స్వప్నదృశః సా నిశా అవిద్యారూపత్వాత్ పరమార్థతత్త్వం పశ్యతో మునేరితి। అతః అవిద్యావస్థాయామేవ కర్మాణిచోద్యంతే। నవిద్యావస్థాయాం విద్యాయాంహిసత్యాముదితే సవితరి శార్వరమివ తమఃప్రణాశముపగచ్ఛతి। అవిద్యాప్రాగ్విద్యోత్పత్తేః అవిద్యాప్రమాణబుద్ధ్యా గృహ్యమాణా క్రియాకారకఫలభేదరూపాచ సతీ కర్మహే

తుత్వం ప్రతిపద్యతే। నాప్రమాణబుద్ధ్యా గృహ్యమాణాయాః కర్మహేతుత్వో
పపత్తిః। ప్రమాణభూతేన వేదేన మమచోదితోఽసౌ కర్మణి రత్యమితిహి కర్మణి
ప్రవర్తతే। నావిద్యామాత్రమిదం సర్వం నిశేవేతి జానన్ యస్య పునః ప్రమాణం
విద్యామాత్రమిదం సర్వం భేదజాతమితిబుద్ధిః। తస్యాత్మజ్ఞస్య సర్వకర్మసంన్యాస
ఏవాధికారః। నప్రవృత్తౌ తథాచ దర్శయిష్యతి। తద్బుద్ధయః తదాత్మానఇత్యాద
నా జ్ఞాననిష్ఠాయామేవ అధికారః। తత్రాపి ప్రవర్తకప్రమాణాభావే ప్రవృత్త్యనుప
పత్తిరితిచేన్న। స్వాత్మవిషయత్వాదాత్మజ్ఞానస్య నహ్యాత్మనః స్వాత్మని ప్రవర్తక
ప్రమాణాపేక్షా ఆత్మత్వాదేవ తదంతత్వాచ్చ సర్వప్రమాణానాం ప్రమాణత్వ
స్య నహ్యాత్మస్వరూపాధిగమేసతి పునః ప్రమాణప్రమేయవ్యవహారస్సంభవతి। ప్ర
మాతృత్వం హ్యాత్మనో నివర్తయతి అంత్యం ప్రమాణం నివర్తయదేవచాప్రమా
ణం భవతి। స్వప్నకాలప్రమాణమివ ప్రబోధే లోకేచ వస్త్వధిగమే ప్రవృత్తిహే
తుత్వాదర్శనాత్ ప్రమాణస్య తస్మాన్నాత్మవిదః కర్మస్వధికార ఇతి సిద్ధం॥

From the Yathi in whom discriminative knowledge has become steady, the matters worldly and relegious, turn away on the disappearance of Nescience in him, as they are the effect of Nescience (అవిద్య). For, ignorance is antagonistic to knowledge. To make this fact clear, the present verse is said. To all ignorent beings, the knowledge of the Supreme Reality is night which, being of the form of darkness (తమః) makes all things unperceivable. The true nature of the Supreme Reality is accessible to the man of steady knowledge; just as what is night to night-wanderers (నక్తంచరాణాం) is day to others, so to all the ignorant beings who correspond to night-wanderers, the knowledge of the Highest Reality is night, as it is unknowable to those who have no mind for it. The yogi of controlled passions and restrained senses is ever awake from the sleep of ignorance, in reference to the knowledge of the Highest, when all (ignorant) beings who are really in the sleep of ignorance which is characterised by the diversity of the knower and the knowable &c., are waking like persons dreaming in sleep at night; that state being of the form of ignorance is night in the view of the Muni who knows the

Highest truth. Wherefore Karma is prescribed to one in the state of ignorance, not of knowledge. Just as the darkness of the night disappears on the dawn of the sun, so does ignorance disappear, on the rise of knowledge. Before the rise of knowledge, the Nescience (అవిద్య) being of the form of actor, action and the result, and being accepted with the sense of authority attains the state of being the source of all Karma; when it is not viewed as authority, it ceases to be the cause of inducing action. Man engages himself in the performance of Karma only with the notion that it is his duty to do so as it is enjoined on him by the Vedas which are the highest authority but not knowing that all this duality is mere ignorance, as though it were night. But when once he knows that all this multitude of diversities is merely ignorance as though it were night, that knower of the *self* is entitled only to the renunciation of all works, and not to activity. Accordingly the Lord will show in Adhy 5. *r*. 16 that one who thinks of Brahma and who is in pursuit of the *self* is entitled to the devotion to knowledge (జ్ఞాననిష్ఠ . The పూర్వపక్షి objects that in the absence of an injunction (*i. e*, ప్రవర్తక ప్రమాణ) one will not take to that path either (తత్ర) the path of knowledg. This objection is not sound. For, the thing to be known by the *self* is one's *own self* and there can indeed be no injunction inducing one to devote one's *self* to one's own Atma, as the Ataına is one's own *very self*. (The purvapakshi again says that even to the knower some sort of injunctions are necessary, to know ప్రమాణ the sources of right knowledge and ప్రమేయ the objects to be known thereby. The Siddhanti replies that even there no injunctions are necessary; for, the testimony of all[1] proofs (ప్రమాణ) ultimately ends in disclosing the knowledge of the *self* and when the true nature of the *self* is comprehended, all distinctions of the sources of knowledge and the objects to be known thereby, cease to exist. The higest authority (the Vedas) declares that the *self* is no percipient of objects and as a consequence of that teaching, ceases to be an authority any longer just as the dream-perception ceases to be an authority during the waking condition. We see in ordinary life that when a thing is comprehended, there is no neces-

sity for the operation of the source of knowledge, by which the thing is known. Therefore the knower is not entitled to Karma.

-::o::-

### తాత్పర్యము.

ఆత్మవేత్తయైన స్థితప్రజ్ఞునకు సర్వకర్మపరిత్యాగమునందు అనగా సంన్యాసమునందు అధికారమనియును, ఆత్మవేత్తగాని యవివేకికి కర్మమునందధికారమనియును, లౌకిక వైదిక వ్యవహారము అవిద్యవలన బుట్టినదగుటచేత వివేకియగు స్థితప్రజ్ఞునకు అవిద్యనివర్తించిపోయెనేని నివర్తించిపోవుననియును, అవిద్యయు విద్యయు పరస్పరశత్రువులనియును, విద్యయనునది పుట్టినతోడనే అవిద్యయనునది మరలిపోవుననియును తెలియజేయుటకు కృష్ణుడీశ్లోకమును చెప్పుచున్నాడు. స్థితప్రజ్ఞునకు విషయమైన పరమార్థతత్త్వము అవివేకముగల సకలభూతములకును సకలపదార్థములకును కనబడకుండునట్లు చేయునట్టి రాత్రివంటిది. అవివేకునకు పరమార్థతత్త్వము గోచరముగాదు కనుక సకలజనులకును పగలుగానున్న కాలము రాక్షసులకు రాత్రియైయున్నవిధముగ వివేకులకు ప్రకాశరూపముగ కనబడుచున్న పరమార్థతత్త్వము రాక్షసులతో సమానులయిన యవివేకులకు ప్రకాశములేని రాత్రివంటిది. మరియును అజ్ఞాననిద్రలేనివాడును, జితేంద్రియుడును అగు మునిశ్రేష్ఠుడు పరమార్థతత్త్వమే స్వరూపముగాగల రాత్రియందు అనగా సకలభూతముల యొక్క అజ్ఞానావస్థయందు మేలుకొనియుండును. అనగా ఆత్మనుచూచుచుండును. మరియును కర్తా, కార్యము, ఫలముయనెడు భేదమే స్వరూపముగాగల అవిద్యయనెడు నిద్రయందు అనగా అజ్ఞానావస్థయందు నిద్రనుపొందుచున్నవారలే మేలుకొనుచున్నవారని చెప్పబడుచున్నారు. రాత్రులయందు నిద్రనుబొందియుండి కలలనుకనుచున్నకాలమునందు మేలుకొనియున్నవారమని తలచుచున్నవారివలెనే సకలస్వరూపము బ్రహ్మస్వరూపమయియుండగా వాడు, వీడు యను భేదబుద్ధి కలవారు తాముతలచుచున్న భేదమే సత్యమని యెంచుచున్నారు. కనుక నిద్రను పొందుచున్నవారే మేలుకొనియున్నారని చెప్పబడుచున్నారు. పరమార్థతత్త్వమునుచూచుచున్న సంన్యాసికి ద్వైతావస్థ అవిద్యారూపమైనదగుటవలన రాత్రివం

టిది. అవివేకులకు పరమార్థావస్థ రాత్రివంటిది. ద్వైతావస్థ వివేకులకు రాత్రి వంటిది. ద్వైతబుద్ధిగలమనుజులు అవిద్యావస్థయందే కర్మాధికారులు. విద్యావస్థ యందధికారులుకారు. విద్యపుట్టినదగుచుండగా, సూర్యోదయమైనపిమ్మట చీకటి నశించువిధముగ, అవివేకమంతయు నశించును. విద్యయనునది పుట్టకమునుపు అవిద్యబాధింపబడినదగుచు క్రియాకారకఫలభేదమును గలుగజేయుచు వాస్తవమని యెడు తలంపుచేత (ప్రమాణబుద్ధి) గ్రహింపబడినదగుచు, సకలకర్మములకునుకారణమగుచున్నది. విద్యపుట్టినపిమ్మట అవిద్యనివర్తించిపోవును. క్రియాదిభేదము వాస్తవముకాదనియెడుబుద్ధికలుగును గనుక క్రియాదిభేదములుకల అవిద్య కర్మమునకుకారణముకానేరదు. వాస్తవమునుదెలుపునట్టి వేదముచేత కోరికలును, జీవనమును మొదలగునవికలనాకు కర్మము విధింపబడినదిగనుక నేను కర్మములను చేయ తగినవాడనని తలంచువానిని వేదము కర్మమునందు ప్రవర్తింపచేయుచున్నది. వాస్తవముగలేనిదేఅయిన యీద్వైతప్రపంచమంతయును రాత్రివంటిదని తలచువాడు కర్మప్రవర్తకుడు కాడు. లోకములో వాస్తవముగ లేనిదే అయిన ద్వైతప్రపంచమంతయును రాత్రివంటిదని తలచు ఆత్మవేత్తకు సర్వకర్మసంన్యాసమునందే అధికారముకాని కర్మమునందు (ప్రవృత్తియందు) అధికారములేదు. కృష్ణుడు అ. 5. శ్లో. 19. లో ఆత్మవేత్తకు జ్ఞాననిష్ఠయందే అధికారమని చెప్పుచున్నాడు. ఏకార్యమునందైనను ప్రవర్తింపజేయునట్టి ప్రమాణము విధియనబడును. అట్టివిధి లేనియెడల ఎవ్వడును ఏకార్యమునందు ప్రవర్తింపడు. కావున కర్మములయందువలెనే జ్ఞాననిష్ఠయందుగూడ ప్రవర్తింపజేయు విధివాక్యములావశ్యకమను వాదము సరికాదు. ఏలననగా తెలిసికొనువానికంటె ఇతరమైనవస్తువుయొక్క జ్ఞానము విధింపబడుట లోకప్రసిద్ధము. అయితే ఆత్మవిజ్ఞానముచేత తెలియబడునట్టివస్తువు ఆత్మయే (తానె) కనుక ఆత్మజ్ఞానము విధింపబడదు. మరియును వేదముచేత (ప్రవర్తకప్రమాణము) సాధింపబడతగినవస్తువు విధింపబడును. అసాధ్యవస్తువు అట్లువిధింపబడదు. గనుక ఆత్మ అసాధ్యమగుటచేత సాధింపబడదు. మరియును తెలిసికొనునది ఆత్మయె గనుక ఆత్మయందు ప్రవర్తకప్రమాణముయొక్క అపేక్షలేదు. ఎవ్వనికిని తనయందు నేనున్నానా లేదా అనిసందేహములేదు. ఏలననగా తానుండేనేకదా ఇతరవస్తువులనుగురించి యాలోచించుట సంభవించుట. మరియు

ము జ్ఞానికి ఇదిప్రమాణము ఇదిప్రమేయము అనునట్టివ్యవహారమునుగురించి నియమముకొరకు విధియొక్క అపేక్ష కావలసియుండును అనిసందేహింపగూడదు. ఏలననగా సకలప్రమాణములకు ప్రామాణ్యము వాస్తవవిషయమును తెలుపునట్టి ధర్మము, ఆత్మజ్ఞానము కలుగువరకు కలిగియుండును. అట్టిజ్ఞానము కలిగినపిమ్మట ప్రమాణప్రమేయవ్యవహారమునకు నావకాశము లేదు. అంత్యప్రమాణమగు వేదము ఆత్మకు ప్రమాతృత్వము (అనగా తెలిసికొనువాని ధర్మము) లేదని చెప్పుచు తానుకూడ నశించిపోవును. అనగా అప్రమాణమగుచున్నది. లోకములో స్వప్నకాలమునందలి ప్రమాణము జాగ్రదావస్థయందు స్వప్నముతోగూడ నశించిపోవును. లోకమునందు వస్తువుయొక్క వాస్తవజ్ఞానముకలుగువరకును ప్రమాణాపేక్ష కలిగియున్నదికాని వస్తువుయొక్క వాస్తవజ్ఞానముకలిగినపిమ్మటగూడ ప్రవర్తకప్రమాణముయొక్క అపేక్షలేదు. ఆరీతిగానే అద్వైతజ్ఞానముకూడ వాస్తవమైనదగుటచేత అద్వైతజ్ఞానమునకుగూడ విధియొక్క అపేక్షలేదు.

---

*Notes.*

The Jist of the verse.

Night is తమస్స్వభావా *i. e.*, of the form of darkness. అవిద్యా Nescience is also తమస్స్వభావా night is dark and blank, as not disclosing anything or not disclosing things as they are. The knowledge of the true nature of the *self* is night to the ignorant because he cannot see anything through it, as if it were night. The sage opens his eyes upon things over which the ignorant man sleeps. The ignorant man is said to be waking (యస్యాంజాగ్రతి) in the sleep of ignorance, in the way in which a man who is dreaming in sleep, is said to be wakeful. This illusory state is night to the sage.

భూతాని = ప్రాక్ స్వకర్మవశాత్ సుభూత్వైవ పునః పునః భవంతిజాయంతే ఇతిభూతాని.

---

ఆపూర్యమాణమచలప్రతిష్ఠం సముద్రమాపః ప్రవిశంతి
యద్వత్ । తద్వత్కామాయం ప్రవిశన్తి సర్వే స శాం
తిమాప్నోతి న కామకామీ ॥ 70

టీక.

ఆపూర్యమాణం= (అనేకనదులలోని యుదకముచేత) సంపూర్ణముగానిం డింపబడినదియును, అచలప్రతిష్ఠం = హద్దుమీరని, (లేక) స్థిరమయిన, ఉనికికలది యును, (అయిన) సముద్రమ్ = సముద్రమును, ఆపః = (వర్షము మొదలగువానివలన గలిగిన) ఉదకములు, యద్వత్ = ఏవిధముగా, ప్రవిశన్తి = ప్రవేశించుచున్నవో, తద్వత్ = ఆప్రకారముగానే, సర్వే= సమస్తములు, (అయిన) కామాః = కోర్కె లు, యమ్ = ఏబ్రహ్మనిష్ఠుని, ప్రవిశన్తి = ప్రవేశించుచున్నవో, సః = అట్టిబ్రహ్మ నిష్ఠుడు, శాన్తిం = (విషయనివృత్తిరూపమయిన) మోక్షమును, ఆప్నోతి = పొం దుచున్నాడు, కామకామీ = విషయములయందభిలాష కలవాడు, నాప్నోతి = (మోక్షమును) పొందడు.

He attains the bliss of peace, in whom all desires (for sensuous objects) enter (and become merged), just as waters enter the sea which is filled with water from all sides and (yet) remains unchanged; but not he who desires the objects of enjoyment.

——::o::——

**Com.** భాష్యం.

——:o:——

విదుషస్త్యక్తైషణస్య స్థితప్రజ్ఞస్య యతేరేవ మోక్షప్రాప్తిః నత్వసంన్యా సినః కామకామినఇత్యేతమర్థం దృష్టాంతేనోపపాదయిష్యన్నాహ— ఆపూర్య మాణమితి ॥ ఆపూర్యమాణమద్భిః అచలప్రతిష్ఠమచలతయా ప్రతిష్ఠా యస్య తమ చలప్రతిష్ఠం సముద్రమాపస్సర్వతోగతాః ప్రవిశంతి స్వాత్మస్థమవిక్రియమేవసంతం యద్వత్ తద్వత్కామాః విషయస్సన్నిధావపి సర్వఇచ్ఛావిశేషాః యం యతిం సముద్రమివాపః అవికుర్వంతః ప్రవిశంతి సర్వే ఆత్మన్యేవ ప్రలీయంతఇత్యర్థః। న స్వాత్మవశం కుర్వంతి సశాంతిం మోక్షమాప్నోతి నేతరః। కామకామీ కామ్యం తఇతి కామాః విషయాస్తాన్ కామయితుం శీలం యస్య సకామకామీ సనప్రా ప్నోతీత్యర్థః ॥

The Lord points out by an illustration, in the verse ఆపూర్య..., that the enlightened man alone who has renounced the three-fold

desires, and whose knowledge is steady, can attain Moksha but not one who without abandoning, cherishes desires for the objects of pleasure.

The ocean is filled with waters from all sides (ఆపూర్యమాణం). It never transgresses its bounds. *i. e.*, although waters coming from all sides enter the ocean, its condition remains unaffected and changeless (అచలప్రతిష్ఠం). Similarly that sage attains Moksha in whom all sorts of desires, even in the midst of objects of pleasure, enter without effecting any change, as waters enter the ocean, *i. e.*, in whose *self* they become merged without making it yield to them. But he who desires objects does not so attain it. కామ is that which is desired *i. e.*, objects of enjoyment.

—:.o::—

తాత్పర్యము.

---

ఈషణత్రయవర్జితుడును, శ్రవణమనననిదిధ్యాసములచేత దృఢమైన యాత్మసాక్షాత్కారముకలవాడును, వివేకవైరాగ్యముకలవాడును అగు విద్వాంసునకే మోక్షముకలుగునని దృష్టాంతమును చూపుచు ఈశ్లోకమును కృష్ణుడుచెప్పుచున్నాడు. సముద్రము సర్వతోముఖముగా ఉదకములచేత నిండియున్నను, అరణ్యనములలోనియుదకములు, నదీోదకములు మొదలగునవి ప్రవేశించినపుడు వృద్ధిక్షయవికారమును పొందదు. మరియును దానిఉదకములయొక్కగుణములు (ఉప్పనితనము...) గూడ మారవు. తనహద్దు నెన్నటికిని మించదు. ఈరీతిగానే పవిద్వాంసుడు విషయసమీపమందున్నప్పుడుకూడ, అరణ్యనములు మొదలగునవానిలోని యుదకములు ప్రవేశించినపుడు సముద్రమునకు పవికారమును కలుగనివిధముగ, నిర్వికారుడైయుండునో, ఎవనియందు సకలకోరికలుప్రవేశించి సంతోషవ్యసనములను గలుగజేయక తమయధీనముజేసికొనలేక వానియందు లీనమగుచున్నవో అనగా విషయవిముఖునిగా జేయుచున్నవో అట్టి విద్వాంసునకు మోక్షముకలుగును. విషయాభిలాషకలవానికి మోక్షము కలుగదు.

*Notes.*

The jist of the verse.

The ocean is already filled with water. When waters from the various rivers and from rain enter the sea it does not seem to swell with them or decrease in their absence in summer. It ever remains changeless. Again the waters coming from various sources and possessing *various* properties such as heaviness, tastes &c., *cannot impart* their properties to the ocean, when they enter it, nor can they *retain* their inherent properties; they *lose* their names, forms and properties *in those of* the sea. Similarly in the case of the sage who has abandoned all desires, desires of all sorts enter into him without causing any change in the form of growth and decay. They connot create in him the feelings of joy or sorrow, nor can they enslave his mind. They enter in him in the usual course, lose their natural properties and become merged in his view of the unity of *self.*

అచలప్రతిష్ఠం :—అచలా = చలనవర్జితా, ప్రతిష్ఠా = జలస్థితిమర్యాదా యస్యసః అచలప్రతిష్ఠః.

శాంతి = the moksha in the form of the cessation of all sorrows &c., సకలదుఃఖనివృత్తిరూపమైన మోక్షము.

విహాయకామాన్యస్సర్వాన్పుమాంశ్చరతి నిస్పృహః।
నిర్మమో నిరహంకారస్సశాంతిమధిగచ్ఛతి॥ 71

---

టీక.

యః = ఏ, పుమాన్ = పురుషుడు, సర్వాన్ = సమస్తములైన, కామాన్ = విషయములను, విహాయ = విడిచి, నిస్పృహః = (ఆవిషయములు కావలయునని యెడు) తలంపులేనివాడును, నిర్మమః = నాదియను సంకల్పమువిడిచిన వాడును, నిరహంకారః = కోపములేనివాడును, (ఐ) చరతి = సంచరించుచుండునో, సః = ఆపురుషుడు, శాంతిం = చిత్తోపరమమును, (సమస్తదుఃఖనివృత్తిరూపమయిన మోక్షమును) అధిగచ్ఛతి = పొందుచున్నాడు.

That man attains peace, who, renouncing all desires, moves about unattached to objects, without selfishness, and without conceit.

——;:o::——

**Com.** భాష్యం.

——:o:——

యస్మాదేవం తస్మాత్ విహాయేతి ॥ విహాయ పరిత్యజ్య కామాన్ యస్సన్యాసీ పుమాన్ సర్వాన శేషతః చరతి జీవనమాత్రచేష్టా శేషః పర్యటతీత్యర్థః। నిస్పృహః శరీరజీవనమాత్రేపి నిర్గతా స్పృహా యస్య స నిస్పృహః। నిర్మమః శరీరజీవనమాత్రాక్షిప్తపరిగ్రహేపి మమేదమిత్యభినివేశవర్జితఇత్యేతత్। నిరహంకారః విద్యావత్త్వాది నిమిత్తాత్మసంభావనారహితఇత్యేతత్। సఏవంభూతః స్థితప్రజ్ఞో బ్రహ్మవిచ్ఛాన్తిం సర్వసంసారదుఃఖోపరమలక్షణాం నిర్వాణాఖ్యాం అధిగచ్ఛతి ప్రాప్నోతి బ్రహ్మభూతో భవతీత్యర్థః ॥

The Sanyasi, who having completely relinquished all desires, moves about for the only act of sustaining his life with necessaries, giving up attachment even for the bare necessities of life, without regarding even the things necessary for his very existence as his own, and without entertaining any conceit due to knowledge, wealth &c., such a man of steady knowledge, who knows Brahma, attains the state of peace known as Nirvana which is characterised by the cessation of all the evils of samsara *i. e.*, he himself becomes Brahman.

——::o::——

తాత్పర్యము.

———

మనస్సుచేత సమస్తాభిమానమునువదలి గృహస్థుడు మోక్షమునుపొందగలడనితలచుట మాత్రమనితెలియజేయుటకు శ్రీకృష్ణుడీశ్లోకమును చెప్పుచున్నాడు. ఏసంన్యాసి మనస్సుచేత సర్వాభిమానమునువదలి జీవనమాత్రమునకుతగినవిషయములయందుగూడ కావలయుననియెడు తలంపులేనివాడై, (నిస్పృహః), శరీరజీవనముకొరకు సంపాదించుకొన్నవస్తువునందుగూడ నాదియను తలంపులేనివాడై, (నిర్మమః), పాండిత్యము ధనము మొదలగువానిచేతనన్ను గౌరవించుచున్నారు

అనియెడు గర్వములేనివాడై, (నిరహంకారః), సంసారదుఃఖశాంతిరూపమగు నిర్వాణసుఖమునుబొంది బ్రహ్మమగుచున్నాడు.

---

*Notes.*

The words కామ, నిస్పృహః, మమతా, అహంకార have been fully explained in the Telugu meaning of the Bhashyam. The four things కామము. స్పృహ, గర్వము, అహంకారము are the very characteristics of a house-holder. One that desires moksha must give up these things. So it is impossible that a house-holder can attain Moksha while he is in that order of life.

చరతి:— A portion of the past collective karma, known as ప్రారబ్ధ is the cause of the present existence: The ప్రారబ్ధ expires with the destruction of the present body through which, its effects are experienced, even the sanyasi must act for the bare existence of the body which he cannot avoid. So he must go about (చరతి) for the necessaries of life సన్యాసి జీవనమాత్రమునకు తగినచేష్టకలవాడై యుండవలయును. Again the propriety of the word చరతి is that he must not live at *one* place like a house-holder, for fear of attachment for the place.

శాంతి = మోక్షముకావలయుననియెడు తలంపుకల సన్యాసి కామాదులను విడిచిపెట్టుటకు ప్రయత్నముచేయవలయును; కామాదులను వదలుకొనుటయే మోక్షము.

---

ఏషా బ్రాహ్మీ స్థితిః పార్థ నైనాం ప్రాప్య విముహ్యతి।
స్థిత్వాస్యామంతకాలేపి బ్రహ్మనిర్వాణమృచ్ఛతి ॥ 72

---

టీక.

హేపార్థ = ఓఅర్జునుడా, ఏషా = (ఇదివరకుజెప్పబడిన) ఈ, స్థితిః = నిష్ఠ, బ్రాహ్మీ = బ్రహ్మసంబంధమైనది, ఏనాం = ఈబ్రహ్మనిష్ఠను, ప్రాప్య = పొంది, నవిముహ్యతి = మోహమునుచెందడు, అస్యాం = ఈబ్రహ్మనిష్ఠయందు, అంతకాలేపి = ముసలితనమునందైనను, స్థిత్వా = ఉండి, బ్రహ్మనిర్వాణం = మోక్షమును, ఋచ్ఛతి = పొందుచున్నాడు.

This state of devotion is Brahmic, O Partha; none attaining to this state, is ever deluded. Even at the last period of life, one who takes his stand thereon attains the blissful *nirvana* of Brahma.

———::0::———

## Com. భాష్యం.

———::0::———

సైషా జ్ఞాననిష్ఠా స్తూయతే—ఏషేతి॥ ఏషా యథోక్తా బ్రాహ్మీ బ్రహ్మణి భవేయం స్థితిః సర్వం సన్న్యస్య బ్రహ్మస్వరూపేణైవ అవస్థానమిత్యేతత్। నైనాం స్థితిం ప్రాప్య లబ్ధ్వా విముహ్యతి నమోహం ప్రాప్నోతి। స్థిత్వాస్యాం స్థితౌ బ్రాహ్మ్యాం యథోక్తాయాం అంతకాలేఽపి అంత్యేఽపి వయసి బ్రహ్మనిర్వాణం బ్రహ్మనిర్వృతిం మోక్షం ఋచ్ఛతి గచ్ఛతి। కిముపక్తవ్యం బ్రహ్మచర్యాదేవ సన్న్యస్య యావజ్జీవం యో బ్రహ్మణ్యేవావతిష్ఠతే సబ్రహ్మనిర్వాణమృచ్ఛతీతి॥

ఇతి శ్రీమహాభారతే భీష్మపర్వణి శ్రీమద్భగవద్గీతాసూప
నిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృ
ష్ణార్జునసంవాదే సాంఖ్యయోగో నామ
ద్వితీయోఽధ్యాయః॥
ఓం తత్సత్.

ఏషా means the aforesaid state of devotion to Brahma. స్థిత్వా means remaining in that Brahmic state; అంతకాలే means even in old age; బ్రహ్మనిర్వాణం means the bliss of Brahma, known as Moksha. ఋచ్ఛతి means obtains.

The aforesaid state, which consists in the devotion to Brahma renouncing all, is the Brahmic state by obtaining which, one is not deluded and by remaining in which even in the last days of life one attains the Nirvana of Brahma known as the Moksha or the bliss of Brahma; and it is needless to say that one who, even while living in the Brahmacharya order of life, renounces, and resides in Brahma throught life, attains the bliss of Brahma.

శ్రీమచ్ఛంకరభగవత్పాదకృతౌ
శ్రీభగవద్గీతాభాష్యే ద్వితీయోఽధ్యాయః.

## తాత్పర్యము.

అకడకడ నుపదేశింపబడిన బ్రహ్మను ముముక్షువగువాడు ప్రయత్నముతో అవలంబించుటకు ఈశ్లోకముచేత బ్రహ్మనిష్ఠను స్తోత్రముచేయుచున్నాడు. సర్వ కర్మములను సంన్యసించి బ్రహ్మరూపుడై యుండుట బ్రహ్మనిష్ఠ. బ్రహ్మనిష్ఠనుపొంది నసంన్యాసి గృహస్థునివలె మోహమును బొందడు. మరియును సర్వకర్మములను సంన్యసించి బ్రహ్మనిష్ఠను ముసలితనమునందవలంబించినప్పటికిని మోక్షమును పొందును. బ్రహ్మచర్యాశ్రమమునందే సంన్యసించి బ్రతికియున్నంతకాలము బ్రహ్మ నిష్ఠయందున్నవానికి మోక్షముకలుగునని చెప్పనేల. బ్రహ్మనిర్వాణమనగా బ్ర హ్మానందము. ఇదే మోక్షము.

---

### Notes.

స్థితప్రజ్ఞస్యకాభాషా...(అ 2. శ్లో. 4). అనుశ్లోకమునందలి నాలుగుప్రశ్నలకు ప్ర త్యుత్తరమును చెప్పుటయనియెడు నెపముచేత స్థితప్రజ్ఞునియొక్క లక్షణములను, ముముక్షువుచే యతగిన సాధనములను కృష్ణుడు చెప్పినాడు,

Taking the opportunity of answering the questions in అ. 2 శ్లో. 4, the Lord has explained the characteristic attributes of the man of steady knowledge and also the means of attaining Moksha by one desirous of attaining it (ముముక్షువు).

పార్థ:—This word does not mean here the son of Pritha. స్వస్వ రూపం ప్రకాశ్య ముముక్షుం సంసారమృత్యోః పాతీఇతి పః పరమాత్మా, తమేవ అర్థయతే వాంఛతీతి పార్థః తస్య సంబుద్ధిః హేపార్థ ముముక్షో; పః means the Paramathma who saves us from the death of samsara. One that is after పః is పార్థః *i. e.*, one desirious of Moksha. Arjuna is tho ముముక్షుః.

గృహస్థుడును, సంన్యాసియును ముక్తినిపొందుటా చేఅయినయెడల క్లేశముగు సంన్యాసమును అవలంబించుట ఎందుకు?

ఉ. సంన్యాసికంటె ఇతరులకు అనేకవిధములగు విఘ్నములు సంభవించును కనుక మోక్షమును పొందవలయుననియెడు తలంపుకలవాడు ఆవశ్యకముగా సంన్యాసమును అవలంబింపవలయును.

ఇతి శ్రీమద్భగవద్గీతా
ద్వితీయోఽధ్యాయః
సమాప్తః



